యావిర్భవించినవను విషయము సుప్రసిద్ధమైనదే. ఈ స్తోత్రమునందు ప్రపత్తి విషయములో పలువురు పెద్దలకు సంభవించు నానా సంశయములను బోగొట్టు నట్లు చాల సూక్ష్మములగు ననేక శాస్త్రార్థములు నిండియుండుటచే దీనిని సదం బుశతకమని చెప్పుట కడ్డులేదు. ఇట "అసదంబు శతకే" అనియు పదచ్ఛే దము జేయుదురు. అప్పుడు, అసత్తులనెడు కలత జెందిన నీటికి చిల్లగింజవలె నున్నదని యర్థము. అసత్తులనుగూడ సద్గతిష్ఠులను జేయునదిదియని భావము.

పెద్ద కోలాహలముతోను, బ్రహ్మాండమైన యలలతోను గిరిశిఖరము నుండి క్రిందికి దుముకు గొప్ప జలపాతము ప్రక్కన ఒకడు మాటలాడినచో. వానిధ్వని ఆ మహాశబ్దము నందెవరి చెవిలోను పడదు. అట్లే వేంకటాద్రియందు పెద్ద శబ్దముతో ప్రవహించు అనేక మహాజలప్రపాతముల యొక్క మహాధ్వని, దోషములు చెప్పువారి ధ్వనిని యెవరి చెవియందును పడకుండ నిరోధించు చున్నవట. ఈ కొండలోనుండు సెలయేళ్లన్నియు శ్రీనివాసుని దయయేయని ఈ స్తోత్రములో ననేకపర్యాయములు బహుసాదృశ్యములను బట్టి రూపింపబడి యున్నది. కాగా, దయాదేవియే ఈ నిర్ఝరరూపమునెత్తి యమ్మహాధ్వనిచే దోషోద్ఘాటకులధ్వని నణచివేయుచున్నది. దోషశబ్దము లెవ్వరి చెవియందును పడనప్పుడందరును నీ స్తోత్రము నాదరింతురు. ఇది దయాదేవి ప్రాపంచి కులకుచేయు నుపకారములలో ప్రధానమైనది. పెద్ద జలప్రవాహమెట్టి ప్రతి బంధమును లక్ష్యముబెట్టకెట్లు నిరాటంకముగా ప్రవహించునో. అట్లే దయా ప్రవాహముగూడ ప్రవహింప నారంభించినప్పుడెవ్వరును దానినడ్డగించుటకు వీలుగాదు. మఱియు గత్యంతరహీనులైన దీనులకు నవలంబముగా దయాదేవి యున్నది. ఇట్లు కూలంకషమైన దయ భగవంతునికి కలుగవలయునన్నచో మహాలక్ష్మి సాన్నిధ్యముండి తీరవలయునను విషయమును "దివ్య దమ్పతి దయా" అను పదముచే నాచార్యులిచట సూచించుచున్నారు.

దశమదశకము సమాప్తము.

తన్త్ర వేదాంతతర్కాది శాస్త్రోద్యానేషు సర్వదా ।
విహారీ శఠకోపార్యో వ్యాఖ్యాదిత్థం దయాస్తవమ్ ।

సీ॥ వినుత భారద్వాజ విమలగోత్రోద్భవుం
డమల వ్యంగ్యాన్వయ సముదితుండు
రంగలక్ష్మణసుత ప్రసవనాపవిత్ర
ప్రథిత శాస్త్రజ్ఞాన భవ్యగుణుడు
తంత్ర వేదాంత సత్తర్క శాస్త్రోద్యాన
లీలా విహారైక శీలచణుడు
"శాస్త్రరత్నాకర" శఠకోపనాముడు
మహి భగవద్దయామహిమ నిట్లు ;

గీ॥ దేశికవరప్రణీత "దయాశతకము"
ద్రావిడంబున జేసిన దయావిధమున
తెనుగు వ్యాఖ్యానయుతముగా దనరజేసి
శ్రీనివాసునకర్పించె చిత్తమలర ॥

ఇది జగద్విఖ్యాత పరమహంసపరివ్రాజకాచార్య శ్రీమద్రంగరామానుజ యోగివర్య పాదారవిందసేవాసమాసాదిత సకలశాస్త్రరహస్యార్థుండగు భారద్వాజ శఠకోపాచార్యశిరోమణిచే ప్రణీతంబైన దయాశతకాంధ్రవ్యాఖ్యానము సమాప్తము.

కవితార్కికసింహాయ కల్యాణగుణశాలినే ।
శ్రీమతే వేంకటేశాయ వేదాంతగురవే నమః ॥



శ్రీమతే నిగమాంత మహాదేశికాయ నమః
శ్రీపద్మావతీసమేత శ్రీనివాసపరబ్రహ్మణే నమః

శుభమస్తు